శ్రీగురవేనమః.

# అద్వైత తారావళి.

శ్లో॥ అఖిలపరహంస దేశిక మాగమగూఢార్థదర్శకం
ప్రాజ్ఞం ఆనందపూర్ణసాగర మనిశమహం నౌమి
శంకరాచార్యమ్॥ ౧

తాత్పర్యము. — సమస్తమైన పరమహంసలకు గురువును, వేద రహస్యార్థ వేత్తయు, ఆనందసముద్ర స్వరూపుడును, జగద్గురువును, నగు శంకరాచార్యులకు నేనెల్లప్పుడును నమస్కరించుచున్నాను.

శ్లో॥ శరణం నభవతిజననీ నపితా నచసోదరా నాన్యే। పర
మంశరణమిదంమే చరణంమమ శిరసి దేశికంన్యస్థం॥

తా॥ నాకు తల్లిదండ్రిసోదరులితరులు శరణ్యులుగారు. నాశిరస్సునందుంచబడిన దేశికుని చరణములే శరణములైయున్నవి.

శ్లో॥ స్వాత్మావబోధహీనాః కుణప శరీరాభిమాన పరి
తుష్టాః। వారిజబుద్బుదరత్నం మూఢాః కుర్వంతి
లోహబంధేన॥ 3

తా॥ నీటిబుగ్గను యినుపకట్లతో బంధించి స్థిరముగనుంపజూచు మూ

ధులవలె ఆత్మజ్ఞానములేని హీనులు శవసదృశమగు నీశరీరమే నేనని సంతోషపడుచుందురు.

శ్లో॥ తస్మిదంతాదృశమీదృశ మేతావత్తావదితిచయన్నభ
వేత్। బ్రహ్మైతదిత్యవధేయం నోచేన్న్యపయో భవే
త్ప్రోక్తుంచ॥ ౪

తా॥ జగత్తు నిత్యమనియు, అది యిటువంటిది అటువంటిదియనియు నెంతవరకు తలంచుచుందురో అంతవరకు నేనియు దెలియనేతెలియుదు ఎప్పుడు సమస్తము నేనని తెలియునో అప్పుడు తనకంటెవేరులేదు.

శ్లో॥ నతిరోశ శక్త్యుపాధా సంభవత స్తస్య జీవితేశ్వరతే
నోచేత్తయో రభావాద్విగత విశేషం విభాతినిజ
రూపం॥ ౫

తా॥ మాయ అవిద్యలుందువంతవరకు జీవేశ్వరులుందురు. ఉపాధులు నశింపగనే విశేషణములేకున్న విశేష్యము లేకరూపమై ప్రకాశించును.

శ్లో॥ జలమివ మృగతృష్ణాయాం శుక్తౌరజతం యథాహిరి
వరజ్జౌ। సత్యమివ సకలమేతత్కల్పిత మాభాతిమును
పరానందే॥ ౬

తా॥ ఎండమావులందు జలము ముత్యపుచిప్పలయందు వెండి త్రాడు

నందు పాము, వోల్కిని యీజగత్తు జ్ఞాస్వరూపమగు పరమాత్మ యందు కల్పింపబడ్డది.

శ్లో॥ ఇద మిద మితి ప్రతీతేవస్తు ని సర్వత్ర బాధ్య మానేపి।
అనిద మబాధ్యం తత్వా సత్వాదేతస్య నచపరో
త్మన్వా।

తా॥ సర్వపదార్థములయందును "ఇది" యను స్వరూపము ప్రకాశమానముగలదై వెలుంగుచున్నను అజ్ఞానుల కయ్యది తెలియకున్నది.

శ్లో॥ అఖిలాగమాంతలక్ష్యం హానోపాదాన హీన చిన్మా
త్రం। అనుభూతి మాత్రగమ్యం బ్రహ్మైవాహం తద
స్మి పరిపూర్ణం। ౮

తా॥ సమస్తవేదాంత లక్ష్యములగు నుపనిషత్తులవల్ల తెలియబడుచుండుటయు లేక పోవుటయును లేక అనుభవముచేత తెలియదగి పరిపూర్ణుండైన బ్రహ్మస్వరూపమే నేనైతినని వేత్తలు తెలిసికొనుచున్నారు.

శ్లో॥ చిన్మాత్ర మమల మక్షయ మద్వయ మానంద మను
భవారూఢం। బ్రహ్మైవాస్మితదన్యం నకిమప్యస్తీతి
నిశ్చయో విదుషాం। ౯

తా॥ జ్ఞానస్వరూపమును, నిర్మలమును, నాశములేనిదియు, ద్వయ

రహితమును- అనుభవముకల్ల తెలియబడునదియునగు- ఆబ్రహ్మస్వ రూపమునే- పండితులు "నే"నని నిశ్చయించియున్నారు.

శ్లో॥ జ్ఞానం కర్మణి నస్యాద్జ్ఞానే కర్మాపి తథానస్యాత్
కథమయ మనయో రుభయో స్తపన తమోవత్స
ముచ్చయోఘటతే॥ ౧౦

తా॥ సూర్యుడు చీకటి యేకకాలమున నుండుటెట్లు పొసగదో, అటులనే కర్మయందు జ్ఞానమును, జ్ఞానమునందు కర్మయునుండుట సంభవించదు.

శ్లో॥ తస్మాన్మోహనివృత్తౌ జ్ఞానం ననేహయ మన్య దర్ధ
యతే। యద్వద్ఘన తర తిమిర ప్రకర పరిధ్వంసనే
సహస్రాంశుః॥ ౧౧

తా॥ దట్టమగు చీకటిని పోగొట్టుటకు సూర్యుడెట్లు సమర్థుడగు చున్నాడో అట్లు అజ్ఞాన నివృత్తియైనప్పు దేసహాయములేక జ్ఞానమే హేతువునకు కారణమగుచున్నది

శ్లో॥ కర్మభిరేవ నబోధః ప్రభవతిగురుణా వినా దయానిధి
నా। ఆచార్యవాన్హిపురుషో వేదేత్యర్థస్య వేద సిద్ధ
త్వాత్॥

తా॥ "ఆచార్యవాన్ పురుషో వేదా" అను వేదప్రమాణమునుబట్టి

చి దయాపరుఁడగు గురువుగలవదప్ప కర్మలచేత జ్ఞానముకలుగనేరదు.

శ్లో॥ ఐక్యపరైశ్శ్రుతి వాక్యైరాత్మా శశ్వత్ప్రబోధ్యమా
నోఽపి। దేశికదయా విహీనై రపరోక్షయితుం నశక్య
తే పురుషైః॥ ౧౩

తా॥ జీవబ్రహ్మైక్యమును బోధించు మహావాక్యములవలన కూటస్థ చైతన్యము చక్కఁగా తెలియబడినప్పటికిని, గురువుయొక్క యనుగ్రహమును పొందని వారెప్పటికిని సాక్షాత్కారమును పొందుటకు శక్తులుగారు.

శ్లో॥ మయిసుఖబోధ పయోధౌ మహతి బ్రహ్మాండ
బుద్బుద సహస్రం। మాయామయేన మరుతా
భూత్వా భూత్వా పునస్తిరోధత్తే॥ ౧౪

తా॥ నాస్వరూపమైన సుఖముగు జ్ఞానానంద సముద్రమందు మాయారూప వాయుప్రేరితములై గొప్పవియగు బ్రహ్మాండ సహస్రములు నీటిబుగ్గలవలె బుట్టుచు మరల నశించుచున్నవి.

శ్లో॥ దంతిని దారువికారే దారుతిరో భవతి సోఽపితత్రై
వ। జగతితథా పరమాత్మా పరమాత్మన్యపి జగత్తి
రోధత్తే॥

తా॥ కొయ్యచే చేయబడిన యేనుగురూపమును చూచినపుడు కొయ్య

యను భావమువారి యేనుగయను నభిప్రాయమేర్పడుచున్నది. అటుల
నే ఆత్మస్వరూపమందు జగత్తు ప్రతీతమగుచున్నది. జగత్తు బ్రహ్మ
యందు లయమవుచున్నది.

శ్లో॥ తస్మిన్బ్రహ్మణి విదితే విశ్వమశేషం భవేదిదం విదితం।
కారణ మృది విదితాయాం ఘట కరకాద్యాయ
భావగమ్యంతే॥ ౧౬

తా॥ బ్రహ్మము తెలియబడినపుడు సమస్తప్రపంచమును తెలియును. ఎట్లన కుండ, ముంత, మూకుడు, మొదలగునవి వేర్వేరుగ కనబడుచున్నను వాటిఅన్నిటికిని నాధారము "మన్ను" అని తోచినట్లు, మూలకారణమగు బ్రహ్మపదార్థము తెలిసినంతనే బ్రహ్మమయమేనను నిశ్చయాభిప్రాయమేర్పడును.

శ్లో॥ ఏషవిశేషో విదుషాం పశ్యంతో౽పి ప్రపంచ సంభా
రం। పృథగాత్మనో నకించిత్పశ్యే రన్నిఖిల నిగమ
నిర్ణీతాత్॥ ౧౭

తా॥ వేదార్థముల నిర్ణయము నెఱింగిన పండితులు ప్రపంచసంభారము చేయుచు నన్నిటిని చూచుచు నున్నప్పటికిని, వారు అంతయు నాత్మస్వరూపమనియు బ్రహ్మముకంటె నితరమొద్దియు లేదనియు దలంచి యట్టే సమస్తమును గమనించుదురు. ఇదియే వారియందలి విశేషము.

శ్లో॥ జగదాకార తయాపి ప్రథతే గురుశిష్య విగ్రహ
తయాపి । బ్రహ్మాకారతయాపి ప్రతిభాతీదం పరా
త్పరం సర్వం॥ ౧౮

తా॥ ఈసర్వప్రపంచమును, జగదాకారమువలెను, గురుశిష్యరూపమునను, బ్రహ్మాకారముగను, మహాప్రతిభావంతుఁడగు పరాత్పరుని మహిమగను పండితులు చూచుచున్నారు.

శ్లో॥ కించింత్యం కిమచింత్యం కింకథనీయం కిమస్త్యకథ
నీయం । కింకృత్యం కిమకృత్యం నిఖిల మిదం జాన
తాంవిదుషాం॥ ౧౯

తా॥ దేనిని తలపవలెను? దేనినితలంపరాదు? ఎయ్యదిచెప్పవలెను? ఎయ్యదిచెప్పరాదు? ఏదిచేయఁదగును? ఏదిచేయరాదు? అను నీవిషయములన్నియును పండితులు తెలిసికొనియుందురు (కావున పండితులగువారన్నియుఁ దెలిసి తగువిషయములయందు వర్తింతురని భావము)

శ్లో॥ కబళిత చంచలచేతో గురుతర మండూక జాలపరి
తోషా। శేతే హృదయ గుహాయాం చిరతర మేకైవ
చిన్మయీ భుజగీ॥ ౨౦

తా॥ చంచలమగు చిత్తము విషయములనెడు గొప్పగొప్ప కప్పల సమూహమును కబళించి తృప్తిఁజెందుచున్నది. కుండలినీ శక్తియను పెనుపాము ఎల్లప్పుడు నొక్కటియై హృదయకుహరమను గుహ

యందు నిదురబోవుచున్నది. (అనగా చిత్తము సుఖదుఃఖాదిభోగముల ననుభవింపుచు సంసారరూప నిద్రను పొందుచున్నది).

శ్లో॥ సతితమసి మోహరూపే విశ్వముపశ్యం తదేతదిత్య
ఖిలం। ఉదయతి బోధాదిత్యే కిమపి నపశ్యామి కిన్ని
దం చిత్రం॥ ౨౧

తా॥ మోహామే అజ్ఞానము ఆయజ్ఞానము వలననే యీయఖిల ప్రపంచమున్నా భిన్నభిన్నముల చూడబడుచున్నది. జ్ఞానోదయమైనప్పుడు యేమియు చూడబడదు. ఇందాశ్చర్యమేమికలదు?

శ్లో॥ విద్యాస్థితయః ప్రాక్ సాధన భూతాః ప్రయత్న
నిష్పాద్యాః। లక్షణభూతాస్తు పునస్స్వభావ తస్సం
స్థితాః స్థితప్రజ్ఞే॥ ౨౨

తా॥ నిత్యకర్మాద్యనుష్ఠానములు తత్వజ్ఞానమునకు పూర్వముందు సాధనములు. తత్వజ్ఞానము కలిగిన యనంతరమందవి బ్రహ్మనిష్ఠుని యందు స్వభావముగా నెలకొనుచున్నవి.

శ్లో॥ జీవన్ముక్తి రితీమాం వదంత్యవస్థాం స్థిరాత్మ సం
బోధాం। బాధితభేద ప్రతిభా మబాధితాత్మావ
బోధసామర్థ్యాం ౨౩

తా॥ బాధించుచున్న ద్వైతరూపమైన అజ్ఞానమును పోగొట్టునట్టి యు ప్రకాశముగలదియైన ఆత్మను తెలుపునట్టిదియు బాధరహితమగు

ఆత్మబోధ సామర్థ్యము కలిగినట్టిదియునగు నీయవస్థను "జీవన్ముక్తి" యని బ్రహ్మవేత్తలు పలుకుచున్నారు.

శ్లో॥ అజరోహ మక్షరోహం ప్రాజ్ఞోహం ప్రత్యగాత్మ
బోధోహం। పరమానంద మయోహం పరమ శివో
హం సదాస్మి పరిపూర్ణః॥ ౨౮

తా॥ "నేను" పుట్టనివాఁడను- నశించనివాఁడను- సమస్తమును తెలిసినవాఁడను - కూటస్థరూపుఁడను - పరమానందస్వరూపుఁడను- పరమశివరూపుఁడను- అగుచున్నాను.

శ్లో॥ బహుభిః కిమేభిరుక్తై రహమేవేదం చరాచరం సర్వం।
శీకర ఫేన తరంగా స్సింధోరపరాణి నఖలువస్తూని॥

తా॥ తరంగాదులు సముద్రముకంటె వేరుగానట్టు సమస్తచరాచర ప్రపంచమును "నేనే" బ్రహ్మముకంటె వేరేమున్నది?

శ్లో॥ విదితం వేదరహస్యం విదితో దేహాది రయ మనా
త్మేతి। విదితః పర ఇతిచాత్మా కిమితః పరమస్తి జన్మ
సాఫల్యం॥ ౨౯

తా॥ వేదములయందలి రహస్యము తెలిసినది. దేహము ఆత్మకాదని తెలిసినది. ఆత్మకంటె వేరులేదని తెలిసినది. ఇకకావలసినదిలేదు. దేహాదిప్రపంచము నేనుగాను బ్రహ్మపదార్థమే నేను.

శ్లో॥ గురుకరుణామైన నావా ప్రాప్తేన భాగ్యానుకూల మారుతయా ॥ దుస్సహదుఃఖ తరంగాస్తీర్ణా సంసార సాగర స్తీర్ణః॥ ౨౭

తా॥ గురుకరుణాపడవ. పూర్వజన్మకర్మ యనువాయు. అసహ్యమగు సంసారదుఃఖమే తరంగములు. ఈసముద్రమును దాటుటకు గురుకరుణగాక వేరేమియులేదు.

శ్లో॥ కారుణ్యాసారసాంద్రాః కాంక్షిత వరదానకల్పిత విశేషాః। శ్రీగురుకటాక్షపాతాః శిశిరాశ్శమయంతు చిత్తసంతాపం॥ ౨౮

తా॥ కరుణారస సాంద్రములును కోరిన వరవిశేషముల నొసంగునవియునగు శ్రీగురుకటాక్షముల చల్లదనమువలన చిత్తసంతాపము నశించుచున్నది.

శ్రీసదాశివ బ్రహ్మేంద్రవిరచిత అద్వైత తారావళి,

సమాప్తము,

---

## శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత ప్రశ్నోత్తర రూపకమగు శ్లోకము.

కిం జ్యోతిస్తవ? భానుమానహనిమే- రాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవం రవిదీప దర్శన విధౌ- కింజ్యోతి రాఖ్యాహిమే
చక్షుస్తస్య నిమీలనాదిసమయే- కింధీర్ధియోదర్శనే
కింతత్రాహమతోభవాన్ పరమ కం- జ్యోతిస్తదస్మిప్రభో

### అర్థము.

ప్ర:— తవ- నీకు జ్యోతిః- ప్రకాశము కిం- ఏమి?

ఉ:— మే - నాకు అహని - పగటియందు భానుమాన్ - సూర్యుడు రాత్రియందు ప్రదీపాదికం- దీపము మొదలగునవి.

ప్ర:— ఏవం - ఇవ్విధము స్యాత్ - అయినయెడల రవిదీప దర్శన విధౌ- సూర్యునియొక్కయు దీపముయొక్కయు ప్రకాశము లేనప్పుడు జ్యోతిః - ప్రకాశము కిం - ఏమి? మే - నాకు ఆఖ్యాహి -చెప్పుము.

ఉ:— చక్షుః- నేత్రము.

ప్ర:— తస్య - ఆనేత్రముయొక్క నిమీలనాదిసమయే - మూయుట యందు జ్యోతిః- ప్రకాశము కిం- ఏమి?

ఉ:— ధీః- బుద్ధి.

ప్ర:— ధియః_ బుద్ధియొక్క_ దర్శనే - చూచుటయందు జ్యోతిః - ప్రకాశము కిం_ ఏమి?

ఉ:— తత్ర_ బుద్ధిదర్శనమందున అహం_ నేను.

ప్ర:— అతః_ ఈకారణమువలన భవాన్ - నీవు పరమకం - పరమైన జ్యోతిః_ ప్రకాశము కిం_ ఏమి?

ఉ:— ప్రభో_ ఓపరివ్రాజక ప్రభువా·తత్_అప్రకాశము అస్తి-కలదు.

ఓమ్ శాంతిః.



వాణి ప్రెస్, గుంటూరు.

# శ్రీ జనోపయోగములగు గ్రంథములు.

1. బాల్య వివాహచంద్రిక 0-1-0
2. శ్రీ సనాతన ధర్మబోధిని 0-2-0
3. సతీధర్మ సంగ్రహము 0-3-0
   (ఇందు పతిభక్తి, దైవపూజ, గృహకృత్య నిర్వాహణము, ఏకాదశీ మహిమ మొదలగు విషయములెన్నియో గలవు)
4. అద్వైత తారావళి 0-1-6

వలయువారు:—

రాయప్రోలు సత్యనారాయణ,

అగ్రహారం,

గుంటూరు.

(అని వ్రాయవలెను.)

